ఆశాపాశశతైః- నూరువిధములైన యాశాపాశములచేత; బద్ధాః - కట్టఁబడినవారలై; కామక్రోధపరాయణాః - కామక్రోధ పరాయణులై; కామభోగార్థం- కామభోగములకొఱకు; అన్యాయేన- అన్యాయముచేత; అర్థసంచయాన్ -ధనార్థ సముదాయములను; ఈహంతే-కోరుచున్నారు.

పలు తెరంగులగు ఆశా పాశములచే కట్టబడ్డవారై కామ క్రోధములచే నిండినవారై కామభోగార్థమై అన్యాయసంపాదనములచే ద్రవ్యము ఆర్జింప కోరుచున్నారు.

ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్. (13)

అద్య-ఇప్పుడు; మయా-నాచేతను; ఇదం - ఈధనమును; లబ్ధం-పొందబడెను; ఇమంమనోరథం-ఈసంకల్పమును; ప్రాప్స్యే-పొందగలను; ఇదంధనం-ఈధనము; మే- నాకు; అస్తి-కలదు; ఇదమపి-ఈధనమును; మే-నాకు; పునః-తిరిగి; భవిష్యతి-కాగలదు.

మరిన్ని అట్టివారు ఇంతద్రవ్యము ఇప్పుడు సంపాదించితిని ఇకమీదను ఇంతసంపాదించబోవుచున్నాను ఇంతద్రవ్యమును నాదిగావున్నది, ఇకను నా యభిప్రాయములను పొంద బోవుచున్నాను అని యెంచుదురు.

అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

అసౌశత్రుః-ఈశత్రువు; మయా-నాచేత; హతః- చంపబడెను; అపరానపి-ఇతరశత్రువులను; హనిష్యే-సంహారించగలను; అహం-నేను; ఈశ్వరః-ప్రభువు; అహం - నేను; భోగీ-భోగవంతుడను; అహం-నేను; సిద్ధః-సంపన్నుడను; అహం- నేను; బలవాన్-బలవంతుడను; అహం-నేను; సుఖీ-సుఖవంతుడను.

మరిన్ని ఇప్పుడు నేను ఈశత్రువులను సంహారముచేసితిని ఇకను ఇతర శత్రువులను జంపగలను, నేను నియామకుడను భోగిని సంపత్కరుడను బలాఢ్యుడను సుఖవంతుడను అని యెంచుచున్నారు.

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. 15

ఆఢ్యః-ధనముగలవాడను; అభిజనవాన్ - సత్కులముకలవాడను; అస్మి-అయితిని; మయా-నాతోడ; సదృశః - సమానుడు; అన్యః-మఱియొకడు; కః-ఎవ్వడు; అస్తి- కలడు; యక్ష్యే-యజ్ఞముచేసెదను; దాస్యామి-ఇవ్వగలను; మోదిష్యే-సంతోషించగలను; ఇతి-ఈప్రకారముగా; అజ్ఞానవిమోహితాః-అవివేకముచేత మోహింపబడినవారలై.

ఇదియునుగాక నేను ధనవంతుడను నేను కులశ్రేష్ఠముగల వాడను నాతో సమానులు ఎవ్వరును లేరు నేను యజ్ఞక్రతువులను జేయువాడను దానధర్మములను ఇచ్చువాడను సంతోషించువాడను అని ఇన్నివిధములుగా అవివేకపుమాటలు తలంచుచున్నారు.

అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకే౽శుచౌ. 16

అనేకచిత్తవిభ్రాంతాః-నానావిధచిత్తవైకల్యముకలవారలై. మోహజాలసమావృతాః - మోహపాశములచేత జుట్టబడినవారలై, కామభోగేషు-కామానుభవములయందు, ప్రసక్తాః- ఆసక్తులైనవారలై; అశుచౌ - అశుచియైన; నరకే-నరకమందు, పతంతి-పడుచున్నారు.

అట్టి దురాచారపు మానవులు అనేక విషయముల యందు ఆసక్తియుంచుటవలన చిత్తవిభ్రాంతిబొంది ఆశాపాశముల నెడు వలచేత చుట్టుకొనబడినవారలై కామానుభవములయందు మునింగినవారలై ఘోరమైననరకమునుబొందుచున్నారు.

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజంతే నామయజ్ఞైస్తే దంభేనా౽విధిపూర్వకమ్. 17

ఆత్మసంభావితాః-తమ్ముతామే స్తోత్రముచేసుకొనుచున్న

వారలై; స్తబ్ధాః-పెద్దలనిరాకరించువారలై; ధనమానమదా
న్వితాః-ధనమానమదములతోఁగూడినవారలై; తే - ఆయవి
వేకులు; నామయజ్ఞైః - నామమాత్ర యజ్ఞములచేతను; దం
భేన-దంభముచేతను; అవిధిపూర్వకం - శాస్త్రోక్త వ్యతిరిక్త
ముగా; యజంతే-యజ్ఞము జేయుచున్నారు.

మరియు అట్టి అజ్ఞానులు తమ్ముఁ తామే పొగడుకొని పెద్దల
నిరాకరించి ధనమాన మదములతోఁ గూడుకొని డంబము
కొఱకై శాస్త్రసమ్మతముగాని యజ్ఞములను జేయుచుందురు.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. 18

అహంకారం - అహంకారమును; బలం - బలమును; ద
ర్పం-దర్పమును; కామం-కామమును; క్రోధం- క్రోధమును;
సంశ్రితాః-ఆశ్రయించినవారలయి; ఆత్మపరదేహేషు- స్వేతర
దేహములయందలి; మాం-నన్ను; ప్రద్విషంతః - ద్వేషించు
చున్నవారలయి; అభ్యసూయకాః - పరశ్రేయస్సును సహించ
నివారలై, యే-ఎవరు; వర్తంతే-ఉన్నారో.

మరియు అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము
గలవారై, సర్వాంతర్యామినైననన్ను ద్వేషించి యితరుల సద్గుణ
ములను సహింపక వారలయందు లేని తప్పులను చెప్పుదురు.

తానహంద్విషతః క్రూరాన్ సంసారేషునరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవయోనిషు. 19

అహం-నేను; ద్విషతః-ద్వేషులయిన; క్రూరాన్- క్రూరులయిన; అశుభాన్-శుభరహితులయిన; తాన్నరాధమాన్-ఆమనుష్యాధములను; అజస్రం-నిరంతరమును; సంసారేషు-సంసారములయందును; ఆసురీషు - అసురసంబంధములయిన; యోనిష్వేవ - యోనులయందే; క్షిపామి-ఉంచుచున్నాను.

నాకు శత్రువులయి చెడు మనస్సుగల అట్టి నీచులనువెల్లప్పుడు రాక్షసాంశమైన నికృష్టజన్మములను ఎత్తునట్లుగా యుచున్నాను.

ఆసురీంయోనిమాపన్నా మూఢాజన్మనిజన్మని।
మామప్రాప్యైవకౌంతేయ తతోయాంత్యధమాంగతిం.

హే కౌంతేయ- ఓయి అర్జున! మూఢాః-అవివేకులు; జన్మనిజన్మని - ప్రతిజన్మమందును; అసురయోనిం-అసురయోనిని; ఆపన్నాః- పొందినవారలయి; మాం-నన్ను; అప్రాప్యైవ-పొందకనే; తతః-ఆతర్వాత; అధమాంగతిం - నికృష్టగతిని; యాంతి-పొందుచున్నారు.

ఓ అర్జున! అట్టి నికృష్టజన్మముల నొందెడు అవివేకులు నికృష్టజన్మములు ఎత్తుచూ, జన్మజన్మమునకు అధోగతిని పొం

దుమా పుండుగాని వృద్ధు ఎప్పటికిని తెందజాలరు.

త్రివిధంనరకస్యేదం ద్వారంనాశనమాత్మనః।
కామఃక్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయంత్యజేత్. 21

కామః-కోరికయనియు; క్రోధః-క్రోధమనియు; తథా-ఆలాగే; లోభః-లోభమనియు; త్రివిధం - మూడువిధములుగలిగిన; ఇదం-ఇది; నరకస్య - నరకమునకు; ద్వారం-వాకిలి; ఆత్మనః-తనకు; నాశంచ-నాశకరమైనది; తస్మాత్ - అందువలన; ఏతత్త్రయం-యీమూటిని; త్యజేత్ - విడువవలెను.

కామము, క్రోధము, లోభము ఈ మూడును ఆత్మను నాశముజేయునట్టివి. అవి నరకప్రాప్తికి హేతువులగును గనుక ఈ గుణములను విడిచి పెట్టవలయును.

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనఃశ్రేయ స్తతోయాతిపరాంగతిమ్. 22

హే కౌంతేయ-ఓయి అర్జునా! త్రిభిః-మూడైన; ఏతైః-ఈ; తమోద్వారైః-నరకద్వారములచేత; విముక్తః - విడువబడిన: నరః-నరుడు; ఆత్మనః-తనకు; శ్రేయః- శ్రేయస్సును; ఆచరతి-ఆచరించుచున్నాడు: తతః - అతర్వాత; పరాంగతిం-మోక్షగతిని; యాతి-పొందుచున్నాడు.

ఓ అర్జునా! పై జెప్పిన కామక్రోధ లోభములను వదిలి

నవాడు తనఆత్మకు శ్రేయస్కరమై శాస్త్రసమ్మతమైన తపో
యోగాది కర్మలను ఆచరించి మోక్షమును జెందుచున్నాడు.

యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।
నససిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిమ్. 23

యః-ఎవ్వడు; శాస్త్రవిధిం-శాస్త్రవిధిని; ఉత్సృజ్య- విడిచి; కామకారతః - యథేచ్ఛముగ, వర్తంతే- వర్తించుచు న్నాడో, సః-వాడు; సిద్ధిం-సిద్ధిని; నావాప్నోతి- పొందడు; సుఖంచ-సుఖమును; నాప్నోతి-పొందడు; పరాంగతిం - మోక్షగతిని, నావాప్నోతి-పొందడు.

ఎవడైతే శాస్త్రనియమమును అనుసరించక ఇచ్ఛామార్గముగా వర్తించుచున్నాడో అట్టివానికి సిద్ధిలేదు, సుఖము లేదు, పరలోకప్రాప్తి లేదు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి. 24

తస్మాత్-అందువలన; కార్యాకార్యవ్యవస్థితౌ- కర్తవ్యాకర్తవ్యవ్యవస్థితియందు; తే-నీకు; శాస్త్రం- శాస్త్రము; ప్రమాణం-జ్ఞానసాధనము (అందువలన); శాస్త్రవిధానోక్తం - శాస్త్రవిధిచేత జెప్పబడిన, కర్మ-కర్మమును; జ్ఞాత్వా - తెలిసికొని; ఇహ-ఇప్పుడు; కర్తుం-చేయుటకొఱకు; అర్హసి-తగుదువు.

కావున, శాస్త్రములను ప్రమాణములని నమ్మి శాస్త్ర సమ్మతములయిన కర్మలను, శాస్త్రబాహ్యములయిన కర్మలను దాటింగి శాస్త్రోక్తమైన కర్మలను నీవాచరించుచుండుము.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసుర సంపద్విభాగ యోగోనామ షోడశోధ్యాయః.

ఉపనిషద్రూపములును, బ్రహ్మవిద్యయును, యోగ శాస్త్రమును, శ్రీకృష్ణార్జునుల సంవాద రూపంబైన శ్రీభగవద్గీతలయందు దైవాసురసంపద్విభాగ యోగమనెడి షోడశోధ్యాయము ముగిసినది.



# శ్రీ భ గ వ ద్గీ త.

## శ్రద్ధాత్రయ విభాగ యోగోనామ సప్తదశోధ్యాయః.

అర్జున ఉవాచ.

యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః।
తేషాం నిష్ఠాతుకాకృష్ణ సత్త్వమాహో రజస్తమః. 1

హే కృష్ణ-ఓయి శ్రీకృష్ణస్వామీ; యే- ఎవరు; శాస్త్రవిధిం-శాస్త్రాచారమును; ఉత్సృజ్య-విడిచి;శ్రద్ధయా- (వృద్ధాచారసంప్రదాయానుసారముగా) ఆస్తిక్యబుద్ధితో;అన్వితాః-కూడినవారై; యజంతే-పూజించుచున్నారో; తేషాం-వారలయొక్క; నిష్ఠా-నిలుకడ; కా-ఎట్టిది; సత్వమా-సాత్వికమా లేక; రజః-రాజసమా; తమః-తామసమా?

ఓయిఅచ్యుతా! ఎవడు శాస్త్రమందలి ఆచారమునువదలి వృద్ధాచార సంప్రదాయమయిన పూజలు మొదలగునవి శ్రద్ధతో చేయుచున్నాడో వానిగతియేమగుచున్నది అటువంటి యాచారము సత్వరజస్తమములలో నెయ్యది?

శ్రీ భగవాన్ ఉవాచ.

త్రివిధాభవతిశ్రద్ధా దేహినాంసాస్వభావజా।
సాత్వికీరాజసీచైవ తామసీచేతితాంశృణు.　　2

దేహినాం - దేహధారులకు; స్వభావజా - సంస్కారమువలనబుట్టిన; సాశ్రద్ధా-ఆవిశ్వాసము; సాత్వికీ - సాత్వికవిషయమనియు; రాజసీ-రాజసవిషయమనియు; తామసీ- తామసవిషయమనియు; త్రివిధా - మూడువిధములుగలిగినది; భవతి-అవుచున్నది; తాం - అశ్రద్ధను; శృణు-వినుము.

శరీరమునుగలిగియుండువారలకుండు శ్రద్ధ, పూర్వజన్మవా

సనను అనుసరించి, సాత్త్వికము, రాజసము, తామసము అని మూడువిధములుగా నున్నది. వానిం విసరించెద వినుము.

సత్త్వానురూపాసర్వస్య శ్రద్ధాభవతిభారత।
శ్రద్ధామయోఽయంపురుషో యోయచ్ఛ్రద్ధస్సఏవసః. 3

టీ. భారత - ఓయి అర్జున! సర్వస్య - సమస్తప్రాణుల కును. సత్త్వానురూపా - విశిష్టసంస్కారయుక్తాంతఃకరణము నకు ననురూపమయిన, శ్రద్ధా-విశ్వాసము, భవతి-అవుచున్న ది (ఆకారణమువలన), అయంపురుషః - ఈ జీవుడు; శ్రద్ధా మయః-ఆస్తిక్యబుద్ధిగలవాడో; యః- ఏపురుషుడు; యచ్ఛ్రద్ధః-ఏయాస్తిక్యబుద్ధిగలవాడో, సః-ఆపురుషుడు; సఏవ- ఆశ్రద్ధప్రధానముగాగలవాడు.

ఓ భారత! ఎల్ల ప్రాణులకు వారి వారి పూర్వ జన్మంబుల యందు చేసిన కర్మఫలంబులననుసరించి శ్రద్ధ గలుగుచున్నది. ఆహేతువువలనజీవులకు పైని చెప్పఁబడిన మూడు గుణములలో నేగుణము అలవడుచున్నదో ఆ గుణమును అనుసరించిన శ్రద్ధ గలుగుచున్నది.

యజంతేసాత్త్వికాదేవాన్ యక్షరక్షాంసిరాజసాః।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజంతేతామసాజనాః. 4

సాత్త్వికాః-సత్త్వగుణనిష్ఠులు, దేవాన్ - దేవతలను; యజం

తే-పూజింపుచున్నారు; రాజసాః- రజోగుణనిష్ఠులు; యక్షర
క్షాంసి - యక్షరాక్షసులను; యజంతే- పూజింపుచున్నారు;
తామసాః-తమోగుణనిష్ఠులయిన; అన్యే-మరికొందరైన; జ
నాః-జనులు; ప్రేతాః-ప్రేతలను; భూతగణాంశ్చ - భూతాది
ములను; యజంతే-పూజించుచున్నారు.

సత్వగుణము వడిన వారలు దేవతలను రజోగుణనిష్ఠులు
వారలు యక్షరాక్షసులను తమోగుణమలవడినవారలు ప్రే
తభూతగణంబులను శ్రద్ధతోఁబూజింతురు.

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః।
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. 5
కర్శయంతశ్శరీరస్థం భూతగ్రామమచేతసః।
మాంచైవాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్. 6

దంభాహంకారసంయుక్తాః- దంభాహంకారములతోఁగూడి
యున్న; కామరాగబలాన్వితాః - కోరిక అనురాగముబలము
వీటితోఁ కూడుకొనియున్న; యేజనాః - ఏ జనులు; అశాస్త్ర
విహితం - శాస్త్రోక్తముగానట్టి; ఘోరం- పీడకరమయినట్టి;
తపః- తపస్సును; తప్యంతే- తపింపుచున్నారో. యే అచేత
సః - ఏ అవివేకులు; శరీరస్థం- శరీరమందున్న; భూతగ్రా
మం- ఇంద్రియసమూహమును; అంతశ్శరీరస్థం- తత్కర్మసా

తిభూతమైయున్న; మాంచ- నన్ను; కర్శయంతః-కృశింపజే
యుచున్నారో; తాన్ - వారలను; అసురనిశ్చయాన్ - రాక్షస
సంబంధమైన నిశ్చయముగలవారలుగాను;విద్ధి- తెలియుము.

డంబము అహంకారము గలిగి కామరాగ బలములతో
గూడి ఏ మనుష్యులు శాస్త్రవిహితముగాని ఘోర తపమును
చేయుచున్నారో అట్టి యవివేకులు తమ శరీరములయందు
న్న ఇంద్రియ సమూహమును ఆకర్మసాక్షియగు నన్ను కృశిం
పజేయుచున్నారు. అట్టి వారిని అసుర ప్రకృతి సంభూతులుగా
దెలియుము.

ఆహారస్త్వపిసర్వస్య త్రివిధోభవతిప్రియః।
యజ్ఞస్తప స్తథాదానం తేషాంభేదమిమంశృణు. 7

సర్వస్య-సమస్తప్రాణులకును; త్రివిధః-మూడువిధములుగ
లిగిన; ఆహారః-భోజనము; ప్రియః- ఇష్టమైనది; భవతి- అవు
చున్నది; తథా - ఆలాగుననే; యజ్ఞః-యజ్ఞమును; తపః- తప
స్సును; దానం-దానము ప్రియమైనది; తేషాం- వానియొక్క;
యిమంభేదం - ఈభేదమును; శృణు-వినుము.

ఎల్ల ప్రాణులకు భోజన పదార్థములుగూడా పైె జెప్పిన స
త్వ రజస్తమోగుణముల ననుసరించి ఇష్టముగా నుండునవి. ఆ
విధముననే యజ్ఞము,తపస్సు, దానమున్ను త్రిగుణాత్మకములు

గానున్నది. వాని తారతమ్యంబుల వివరించెద వినుము.

ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః॥

రస్యాః-రసయుక్తములైన; స్నిగ్ధాః- చమురుతోగూడిన వియు; స్థిరాః-చిరకాలస్థాయులైనట్టివి; హృద్యాః- ప్రియములైనట్టివిన్ని ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః - ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వృద్ధికరములైనవియునైన; ఆహారాః-భోజనములు; సాత్త్వికప్రియాః-సత్త్వగుణములు గలవారలకు నిష్టములైనవి.

సత్త్వగుణవంతులు రసయుక్తములయినట్టియు చేతితోగూడియున్నట్టియు చిరకాలస్థాయులైనట్టియు ప్రియములైనట్టియు ఆయుస్సు,సత్త్వము,బలము, ఆరోగ్యము ప్రీతి వృద్ధికరములయినట్టి భోజనపదార్థములను యిష్టముతో నంగీకరింతురు.

కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః।
ఆహారారాజసస్యేష్టా దుఃఖశోకా మయప్రదాః.          9

దుఃఖశోకామయప్రదాః - దుఃఖ శోకరోగప్రదములైన; కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః, కటు-మిక్కిలి చేదును, అమ్ల-మిక్కిలిపులుసును,లవణ- మిక్కిలియుప్పును,అత్యుష్ణ-మిక్కిలి వేడియును, తీక్ష్ణ-మిక్కిలి కారమును, రూక్ష-శో

దరివాదులును, విదాహినః - అవాలు మొదలైనవి; ఆహారాః - ఈభోజనములు; రాజసస్య - రజోగుణముగలవానికి; ఇష్టాః - ప్రియములు.

దుఃఖము, శోకము, రోగము, గలుగ జేయు నట్టి చిక్కుడు చేదు, ఉప్పు, పులుసు, గలిసి కారమైన బహు వేడి పదార్థంబుల రజోగుణప్రధానులు యిష్టముతో నంగీకరింతురు.

యాతయామంగతరసం పూతిపర్యుషితంచయత్।

ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనంతామసప్రియమ్॥ 10

యద్భోజనం-యేఆహారము; యాతయామం - జాము వెళ్లి చల్లనైనది; గతరసం-రసవర్జితమైనదియు; పూతి-దుర్గంధము గలిగినదిన్ని; పర్యుషితం-పక్వమైన రాత్రిగడచినదిన్ని; ఉచ్ఛిష్టం-భుక్తావశిష్టమైనదిన్ని; అమేధ్యం- అపవిత్రమైనదిన్ని; యత్ -ఏదో; తత్ -ఆ యాహారము; తామసప్రియం - తామోగుణములుగలవానికిష్టమైనది.

వంటచేసిన పిదప ఝాముకాలమై చల్లారినదియు, సారములేనిదియు, దుర్గంధమైనదియు, పర్యుషితమైనదియు, భోజనమైన పిమ్మట మిగిలినదియు, అపవిత్రమయిన పదార్థములను తమోగుణవంతులు ఆసతో ఆరగింతురు.

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టోయఇజ్యతే।

యష్టవ్యమేవేతిమన స్సమాధాయసనాత్త్వికః. 11

విధిదృష్టః-శాస్త్రోక్తవిధిచేతజూడబడిన; యః యజ్ఞః- ఏ యజ్ఞము; అఫలాకాంక్షిభిః - ఫలాకాంక్షారహితులచేత; యష్టవ్యమేవేతి - యజ్ఞముచేయదగనదేయని; మనః- మనస్సును; సమాధాయ-నిశ్చయముచేసుకొని; ఇజ్యతే - చేయబడుచున్నదో; సః-ఆయజ్ఞము; సాత్త్వికః-సత్త్వగుణప్రధానమైనది.

శాస్త్రవిధిచేత నియమితమైన యజ్ఞములను ఫలకాంక్షలేక చేయుడము మంచిదని మనసానిశ్చయించి ఏ యజ్ఞములు చేయబడుచున్నవో అవిసత్త్వగుణప్రధానములైనవని తెలియుము.

అభిసంధాయతుఫలం దంభార్థమపిచైవయత్।

ఇజ్యతేభరతశ్రేష్ఠ తంయజ్ఞంవిద్ధిరాజసమ్. 12

హే భారతశ్రేష్ఠ-ఓయి అర్జునా! యత్-ఏయజ్ఞము; ఫలం-ఫలమును; అనుసంధాయ- ఉద్దేశించియైన్ని; దంభార్థమపి-మహత్త్వప్రకటనముకొరకును; ఇజ్యతే- యాగముచేయబడుచున్నదో; తంయజ్ఞం-ఆయజ్ఞమును; రాజసం - రజోగుణప్రధానమైనదానిగా; విద్ధి- తెలియుము.

ఓయి భారత! ఫలమును ఉద్దేశించి గాని ప్రతిష్ఠకొరకు గాని చేయబడు యజ్ఞములు రజోగుణ ప్రధానములనిగా తెలియుము.

విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్।
శ్రద్ధావిరహితంయజ్ఞం తామసంపరిచక్షతే. 13

విధిహీనం-శాస్త్రవిహితముకానట్టి; అసృష్టాన్నం-అన్నదానరహితమైనట్టి; మంత్రహీనం - మంత్రరహితమైనట్టి; అదక్షిణం-దక్షిణలేనట్టి; శ్రద్ధావిరహితం-విశ్వాసములేని; యజ్ఞం-యజ్ఞమును; తామసం - తమోగుణ ప్రధానమైనదానినిగా; పరిచక్షతే-చెప్పుదురు.

శాస్త్ర సమ్మతము కానిదియు, అన్నదానము లేనిదియు, మంత్రలోపమైనదియు, శాస్త్రోక్తదక్షిణలేనదియు, శ్రద్ధ లేక చేయబడిన యజ్ఞములు తమోగుణప్రధానములని తెలియుము.

దేవద్విజగురుప్రాజ్ఞ పూజనంశౌచమార్జవం।
బ్రహ్మచర్యమహింసాచ శారీరంతపఉచ్యతే. 14

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం - దేవబ్రాహ్మణగురుప్రాజ్ఞుల పూజించుటయును; శౌచం - శుచిత్వమును; ఆర్జవం-ఋజుత్వమును; బ్రహ్మచర్యం - స్త్రీలయందుసక్తుడుకాకయుండుటయు; అహింసాచ-హింసారాహిత్యమును; శారీరం-శరీరప్రధానమైన; తపః-తపస్సని; ఉచ్యతే-చెప్పబడుచున్నది.

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పెద్దలనుబూజించుటయు, శుచి, కల్మషములేనితనమును, నిషిద్ధస్త్రీగమన వ

ర్జనము, ఇతర ప్రాణులకు హానిచేయక యుండుట యువియన్ని
యు, శరీరప్రధానమైన తపస్సులని చెప్పఁబడుచున్నవి.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

అనుద్వేగకరం-దుఃఖకరముగాని; సత్యం - యథార్థమైన;
ప్రియహితం-ప్రియహితమునైన; వాక్యం- వచనమును; స్వా
ధ్యాయాభ్యసనం-వేదాభ్యాసమును; యత్ -ఏదో; తత్ -అది;
వాఙ్మయం- వాగ్రూపమైన; తపః-తపస్సని; ఉచ్యతే-చెప్పబ
డుచున్నది.

ఇతర ప్రాణులకు మనస్సు నొప్పింపని, ప్రీతి విశ్వాసంబుల
తోఁగూడిన, యదార్థపుమాటలును, వేద మభ్యసించడము
ను, వాగ్రూపమైన తపంబులని చెప్పఁబడు.

మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే. 16

మనః ప్రసాద సౌమ్యత్వం - మనస్సుకు సమాధానమైనవమం
చివృత్తిని; మౌనం-వాఙ్నియమమును; ఆత్మవినిగ్రహః - మ
నోనిగ్రహమును; భావసంశుద్ధిః- మనశ్శుద్ధియు; ఇత్యేతత్ -
అనునది; మానసం - మనస్సంబంధమైన; తపః-తపస్సని; ఉ
చ్యతే-చెప్పబడుచున్నది.

మనస్సున కించిత్తైన సద్వృత్తియు, కొంచముగా మాటలాడుటయును, మనోనిగ్రహమును, మనశ్శుద్ధియు మనస్సునకు సంబంధములయిన తపస్సులని చెప్పంబడును.

శ్రద్ధయాపరయాతప్తం తపస్తత్త్రివిధంనరైః।
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికంపరిచక్షతే. 17

అఫలాకాంక్షిభిః-ఫలకాంక్షారహితులైన; యుక్తైః-యోగులయిన; నరైః-నరులచేత; పరయా-ఉత్కృష్టమైన; శ్రద్ధయా-ఆస్తిక్యబుద్ధిచేత; తప్తం-తపింపబడిన; త్రివిధం-మూడు విధములుగలిగిన; తత్తపః-ఆతపస్సును; సాత్త్వికం-సత్త్వగుణముచేతనైనదానినిగా; పరిచక్షతే (పెద్దలు) చెప్పుచున్నారు.

ఫలకాంక్ష లేక, మిక్కిలి పరిశుద్ధమైన శ్రద్ధతో, యోగులైనవారిచేత పై వివరించిన త్రివిధమైన శరీర వాఙ్మనోతపంబులు సత్త్వగుణప్రధానంబులని పెద్దలు చెప్పుదురు.

సత్కారమానపూజార్థం తపోదంభేనచైవయత్।
క్రియతేతదిహప్రోక్తం రాజసంచలమధ్రువం. 18

సత్కారమానపూజార్థం-సత్కరించుటకొఱకును బహుమానముకొఱకును పూజకొఱకును; దంభేన - దంభముచేత; యత్తపః-ఏతపస్సు; క్రియతే-చేయబడుచున్నదో; ఇహ- ఈలోకమందు; చలం-చలనమైన; అధ్రువం- నశించునట్టి; తత్తపః-

అతపమ్ను; రాజసం-రజోగుణసంబంధమైనదని; ప్రోక్తం - చె
ప్పబడెను.

ఇతరులచేత బూజింపబడుటకును, గౌరవాధిక్యముగను దం
బముకొఱకును జేయునట్టి తపంబు, రజోగుణసంబంధమనియు,
నాశమొందదగినదనియు, చంచలమైనదనియు, ఆర్యులుపలికిరి.

మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్. 19

మూఢగ్రాహేణ - అవివేకనిశ్చయముచేత; ఆత్మనః- దే
హముయొక్క; పీడయాచ-పీడచేతను; పరస్య-పరునియొక్క;
ఉత్సాదనార్థంవా-వినాశముకొఱకైనను; యత్తపః-ఏతస్సు;
క్రియతే-చేయబడుచున్నదో; తత్-ఆతస్సు; తామసం- తా
మసమని; ఉదాహృతం - చెప్పబడెను.

తనకు దుఃఖమును గలుగజేయునదియై. ఇతరప్రాణులనొ
ప్పించునదియునై, చెడ్డయాగ్రహముచేత చేయబడిన తపంబు
తమోగుణసంబంధమైనదియని పెద్దలు వక్కాణించెదరు.

దాతవ్యమితియద్దానం దీయతేఽనుపకారిణే।
దేశేకాలేచపాత్రేచ తద్దానంసాత్త్వికంస్మృతం. 20

దాతవ్యమితి-యివ్వదగినదని; యద్దానం-ఏదానమును; దే
శే-ఉత్తమక్షేత్రమందును; కాలే - పుణ్యకాలమందును; పా

తే-యోగ్యునియందును; అనుపకారిణే-ప్రత్యుపకారము లేని
వానికొఱకు; దీయతే-యివ్వబడుచున్నదో. తద్దానం- ఆదాన
ము; సాత్త్వికం-సాత్త్వికమని; స్మృతం-స్మరింపబడెను.

దాన మొనర్చుట యావశ్యకంబని యెంచి, కాలదేశపా
త్రంబుల నెఱింగి, ప్రత్యుపకార మొనర్పంగ లేని పురుషులకి
చ్చు దానము సత్వగుణప్రధానమైనదని చెప్పబడుచున్నది.

యత్తుప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్యవా పునః।
దీయతేచపరిక్లిష్టం తద్దానంరాజసంస్మృతమ్. 21

యత్తు- ఏ దానము; ఫల ముద్దిశ్యవా- ఫలము నుద్దేశించి
నైనను; పునః-తిరిగిన్ని; ప్రత్యుపకారార్థం- ప్రత్యుపకార
ముకొఱకైనను; పరిక్లిష్టం- మనః క్లేశమవునట్లుగా; దీయతే-
యివ్వబడుచున్నదో; తత్-ఆదానము; రాజసం- రాజసమని
ఉదాహృతం- చెప్పబడెను.

ఫలము నుద్దేశించిన్ని ప్రత్యుపకారము నుద్దేశించిన్ని మ
నస్సు నొచ్చుకొనుచు యివ్వబడిన దానము రాజసగుణ ప్ర
ధానమైనదని చెప్పబడుచున్నది.

అదేశకాలేయద్దాన మపాత్రేభ్యశ్చదీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతం. 22

యద్దానం- ఏ దానము; అదేశ కాలే- నికృష్ట దేశ కాలము
లయందు; అపాత్రేభ్యః - మూర్ఖతస్కరాదుల కొఱకు; దీ
యతే- ఇవ్వబడుచున్నదో; అసత్కృతం - సత్కారరహితమ
యిన; అవజ్ఞాతం-అవమానయుక్తమయిన; తత్ - ఆదానము;
తామసం-తామసమని; ఉదాహృతం-చెప్పబడెను.

నికృష్ట దేశకాల పాత్రములయందు తిరస్కార అవమాన
ములతోఁగూడి యియ్యబడిన దానము తామస గుణప్రధాన
మని చెప్పబడును.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 23

ఓం తత్సదితి-ఓం తత్సత్ అని; త్రివిధః - మూడుప్రకార
ములుగలిగిన; బ్రహ్మణః-పరమాత్మయొక్క; నిర్దేశః - నా
మోచ్చారణము; స్మృతః-చెప్పబడెను; తేన-దానిచేత; బ్రా
హ్మణాశ్చ-బ్రాహ్మణులును; వేదాశ్చ-వేదములును; యజ్ఞాశ్చ-
యజ్ఞములును; పురా-పూర్వకాలమందు; విహితాః - నిర్మిం
పబడినవి.

పరబ్రహ్మనామము ఓం, తత్, సత్, అని మూడువిధము
లుగా ఉచ్చరింపబడును. అట్టి పరబ్రహ్మముచే పూర్వ కాల
మందు బ్రాహ్మణులు వేదములు యజ్ఞములు నిర్మింపబడినవి.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః।
ప్రవర్తంతేవిధానోక్తాః సతతం బ్రహ్మవాదినాం. 24

**తస్మాత్**-ఆకారణమువలన; **విధానోక్తాః**- శాస్త్రోక్తములయిన; **బ్రహ్మవాదినాం**-వేదవాదశీలురయొక్క; **యజ్ఞదానతపఃక్రియాః**-యజ్ఞదానతపస్సులనెడి క్రియలు; **సతతం**- ఎల్లప్పుడును; **ఓమితి**-ఓం అని; **ఉదాహృత్య**- ఉచ్చరించి; **ప్రవర్తంతే**-ఆరంభింప బడుచున్నవి.

ఆ హేతువువలన శాస్త్రోక్తమైన యజ్ఞదాన తపస్సులనే క్రియలను బ్రహ్మవాదులు ప్రారంభించు నపుడు ఓంకారమును ప్రథమమున పలుకుచున్నారు.

తదిత్యనభిసంధాయ ఫలంయజ్ఞతపఃక్రియాః।
దానక్రియాశ్చవివిధాః క్రియంతేమోక్షకాంక్షిభిః. 25

**మోక్షకాంక్షిభిః**-ముముక్షువులచేత;**తదితి** తత్-అనెడిబ్రహ్మాభిధానమును ఉచ్చరించి; **ఫలం**- ఫలమును; **అనభిసంధాయ**-కోరక; **యజ్ఞతపఃక్రియాః** - యజ్ఞక్రతువులును; **దానక్రియాశ్చ**-దానక్రియలును; **క్రియంతే**- చేయబడుచున్నవి.

మోక్షేచ్ఛగలవారిచే, తత్, అనేపరమాత్మస్వరూప నిర్దేశకమైన శబ్దము ఉచ్చరింపబడి యజ్ఞదానతపఃక్రియలు ఫలకాంక్షలేకనే ప్రారంభింపబడుచున్నవి.

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థయుజ్యతే. 26

హే పార్థ—ఓయి అర్జున! సద్భావే— కర్తనుటయందు ను; సాధుభావే—శ్రేష్ఠమనుటయందును; సదితి — సత్ అనెడి; ఏతత్-ఈపదము; ప్రయుజ్యతే- ప్రయోగింపబడుచున్నది; తథా—ఆలాగుననే; ప్రశస్తే-ప్రశస్తమైన,కర్మణి- కర్మమందును; సచ్ఛబ్దః—సచ్ఛబ్దము, యుజ్యతే-ప్రయోగింపబడుచున్నది.

ఓ అర్జున! సత్ అనుశబ్దము స్వాభావికమైన వానిని శ్రేష్ఠమైనవానిని తెలియచేయుటకు సంజ్ఞగానున్నది. ఆ హేతువు వలన ప్రశస్తమైన కర్మలయందు సత్ శబ్దము ప్రయోగింపబడుచున్నది.

యజ్ఞేతపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే।
కర్మచైవతదర్థీయం సదిత్యేవాభిధీయతే.

యజ్ఞే—యజ్ఞమందును; తపసి—తపస్సుయందును; దానేచ- దానమందును; స్థితిః-నిష్ఠ;యా—ఏదో; సా—అది; సదితిచ—సత్ అనియు; ఉచ్యతే—పలుకబడుచున్నది; తదర్థీయం—ఆభగవదర్థీయమైన;కర్మ-కర్మమును; సదితి — సత్ అని; అభిధీయతే- పలుకబడుచున్నది.

యజ్ఞదాన తపస్సులందుగల నిష్ఠ, సత్, అని చెప్పబడును.

భగవత్ప్రీతిగా చేయబడినకర్మలు అన్నియు, సత్, అనిచెప్పఁబడును.

అశ్రద్ధయాహుతందత్తం తపస్తప్తంకృతంచయత్।
అసదిత్యుచ్యతేపార్థ నచతత్ప్రేత్యనోఇహ. 28

హే పార్థ—ఓయి అర్జున! అశ్రద్ధయా-అవిశ్వాసముచేత; యత్-ఏ; హుతం - హోమము; కృతం - చేయబడినదో; యత్-ఏది; దత్తం-ఇవ్వబడినదో; తపః-తపస్సు; తప్తం-చేయబడినదో; తత్ - అసమస్తమును; అసదితి - అసత్తని; ఉచ్యతే-పలుకబడుచున్నది; (కావున నది), ఇహ - ఈలోకమందును; నచ-ఫలించదు; ప్రేత్యచ-లోకాంతరమందును; నో-ఫలించదు.

ఓ అర్జున! శ్రద్ధలేని హోమములు, దానములు, తపస్సులు అసత్ అని చెప్పబడును. అవి ఇహమందు పరమందు సుఖములు గావు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
శ్రద్ధాత్రయ విభాగ యోగో నామ
సప్తదశోధ్యాయః.

ఇట్లు ఉపనిషద్ రూపములును, బ్రహ్మ విద్యయును,
యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జునసంవాదరూపం
బైన శ్రద్ధాత్రయ విభాగ యోగమనెడి
సప్తదశోఽధ్యాయము ముగిసినది.

శ్రీ భగవద్గీత.

మోక్షసన్న్యాసయోగో నామ అష్టాదశోఽధ్యాయః.

అర్జున ఉవాచ.

సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్యచహృషీకేశ పృథక్కేశినిషూదన. 1

హేమహాబాహో-బలముగల భుజములుగలిగిన; హృషీకేశ-ఇంద్రియనియామకుడనైన; హేకేశి నిషూదన- ఓశ్రీకృష్ణస్వామీ; సన్న్యాసస్య - సన్న్యాసముయొక్కయు; త్యాగస్య-త్యాగముయొక్కయు; తత్త్వం - యాథాత్మ్యమును; పృథక్-వేర్వేర; వేదితుం-తెలియుటకొఱకు; ఇచ్ఛామి - ఇచ్ఛయించుచున్నాను.

ఓ కృష్ణ! సన్న్యాస త్యాగముల యొక్క తత్త్వములను ప్రత్యేక ప్రత్యేకముగా తెలియ గోరుచున్నాను, దయచేసి సెలవిమ్ము.

శ్రీ భగవానువాచ.

కామ్యానాంకర్మణాంన్యాసం సన్న్యాసంకవయోవిదుః।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః. 2

కవయః-పండితులు; కామ్యానాం కర్మణాం- కామ్యకర్మములయొక్క; న్యాసం-పరిత్యాగమును; సన్న్యాసం-సన్న్యాసముగాను; విదుః-తెలియుదురు; విచక్షణాః-విద్వాంసులు; సర్వకర్మఫలత్యాగం- సమస్తకర్మఫలత్యాగమును; త్యాగం-త్యాగముగా; ప్రాహుః-చెప్పుదురు.

జ్యోతిష్టోమాది కామ్య కర్మములను వదలుట సన్న్యాసమనియు వేదోక్తమైన ఎల్ల కర్మలను ఆచరించి కర్మఫలములను ఈశ్వరార్పణముసేయుట త్యాగమనియుపెద్దలుచెప్పుదురు.

త్యాజ్యందోషవదిత్యేకే కర్మప్రాహుర్మనీషిణః।
యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యమితిచాపరే. 3

ఏకే-కొందరైన; మనీషిణః-పండితులు; కర్మ-కర్మమును; దోషవత్-దోషముగలదికావున; త్యాజ్యమితి-త్యజించదగినదని, ప్రాహుః-చెప్పుదురు; అపరే-మరికొందరు; యజ్ఞదానతపఃకర్మ-యజ్ఞదానతపస్స్వరూపమైనకర్మము; నత్యాజ్యమితి-విడువదగనిదని; ప్రాహుః-చెప్పుదురు.

కొందరు పెద్దలు ఎల్లకర్మలను దోషముగలవానిగా దల

చి సన్న్యసించవలయునని చెప్పుదురు. మరికొందరు పెద్దలు వేదోక్తమైన యజ్ఞ దాన తపస్సుల నీ కర్మలను విడువకూడదని చెప్పుదురు.

నిశ్చయంశ్శృణుమేతత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగోహిపురుషవ్యాఘ్రః త్రివిధస్సంప్రకీర్తితః. 4

హే భరతసత్తమ-ఓయి అర్జున! తత్రత్యాగే - ఆయీ త్యాగమందు; మే-నాయొక్క-; నిశ్చయం-నిర్ణయమును; శృణు-వినుము; హేపురుషవ్యాఘ్ర-ఓయి అర్జున; హి- ఏకారణమువలన; త్యాగః-త్యాగము; త్రివిధః-మూడు ప్రకారములుగలదిగాను; సంప్రకీర్తిత -చెప్పబడియున్నదో.

ఓ అర్జున! కర్మత్యాగము, కర్మఫలత్యాగమని, చెప్పంబడు ఈ రెండు మార్గములలో నా అభిప్రాయము వినుము. త్యాగము మూడు విధములని చెప్పబడును.

యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యంకార్యమేవతత్।
యజ్ఞోదానంతపశ్చైవ పావనానిమనీషిణామ్. 5

యత్ -ఏది; యజ్ఞదానతపఃకర్మ-యజ్ఞదానతపోరూపమైనకర్మమో; తత్ -ఆకర్మము, కార్యం- చేయదగినది; నత్యాజ్యం-విడువదగినదికాదు; యజ్ఞః-యజ్ఞమును; దానం - దానమును; తపశ్చ-తపస్సును; మనీషిణాం- పండితులకు; పావనా

ని-పవిత్రములయినవి.

యజ్ఞదాన తపో రూపకమైన కర్మ అవశ్యము కర్తవ్యము. దానిని విడువరాదు. ఎందువల్లనగ యజ్ఞ దాన తపః కర్మలు పండితులకు పవిత్రములయినవి..

ఏతాన్యపితుకర్మాణి సంగంత్యక్త్వాఫలానిచ।
కర్తవ్యానీతిమేపార్థ నిశ్చితంమతముత్తమమ్. 6

హే పార్థ-ఓయి అర్జున! ఏతాని-ఈపూర్వోక్తముల యిన; కర్మాణి-కర్మములు; సంగం- మమకారమును; ఫలానిచ-ఫలములను; త్యక్త్వా-విడిచి; కర్తవ్యాని-చేయదగినవి; ఇతి-ఇట్లని; నిశ్చితం - నిశ్చయింపబడిన; ఉత్తమం-ఉత్కృష్టమైన; మే-నాయొక్క; మతం-సమ్మతము.

ఓ అర్జున! పై జెప్పిన మూడువిధములైన యజ్ఞదానతపః కర్మలను మమకార ఫలకాంక్షలువదలి చేయవలెను. ఇది నా నిశ్చయమైన ఉత్తమాభిప్రాయము.

నియతస్యతుసన్న్యాసః కర్మణోనోపపద్యతే।
మోహాత్తస్యపరిత్యాగ స్తామసఃపరికీర్తితః. 7

నియతస్య-నిత్యమైన, కర్మణః- కర్మముయొక్క; సన్న్యాసః- పరిత్యాగము; నోపపద్యతే - ఉపయుక్తముకాదు; మోహాత్-అజ్ఞానమువల్లనైన; తస్య-అనిత్యకర్మముయొక్క; పరి

త్యాగః-పరిత్యాగము; తామసః-తామసమని; పరికీర్తితః-చెప్పబడెను.

వేదోక్తమైన నిత్యనైమిత్తిక కర్మలను వదలరాదు. అలాగు అజ్ఞానముచే వదలుట తామసత్యాగమని తెలియుము.

దుఃఖమిత్యేవయత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
సకృత్వారాజసంత్యాగం నైవత్యాగఫలం లభేత్. 8

యః-ఎవ్వడు; కాయక్లేశభయాత్-శరీరకష్టభీతివలన; యత్కర్మ-ఏకర్మమును; దుఃఖమిత్యేవ - దుఃఖకరమైనదని; త్యజేత్-పరిత్యజించునో; సః-వాడు; రాజసం-రజోగుణసంబంధమైన; త్యాగం-త్యాగమును; కృత్వా- చేసి; త్యాగఫలం-మోక్షఫలమును; నలభేత్-పొందడు.

దేహమునకు నష్టమగునని భయపడి కష్టమిచ్చెడికర్మలను ఎవడు వదలుచున్నాడో అట్టివాడు రాక్షసత్యాగముచేసినవాడగును గనుక కర్మ ఫలత్యాగము వల్ల గలిగెడి మోక్షము వానికి సిద్ధింపదు.

కార్యమిత్యేవయత్కర్మ నియతంక్రియతేర్జున।
సంగంత్యక్త్వాఫలంచైవ సత్యాగస్సాత్త్వికోమతః. 9

హే అర్జున-ఓయి అర్జునుడా! సంగం-ఆసక్తిని; ఫలంచ-ఫలమును; త్యక్త్వా-విడిచి; యత్-ఏ; నియతంకర్మ-నిత్య

కర్మము; కార్యమిత్యేవ-చేయదగినదేయని; క్రియతే- చేయబడుచున్నదో; సత్యాగః-అత్యాగము; సాత్త్విక ఇతి-సత్త్వగుణముపలనబుట్టినదని; మతః-అభిమతము.

ఓ అర్జున! ఆసక్తిని ఫలమును వదలి వేదోక్తమైన నిత్యనైమిత్తికకర్మలు ఆవశ్యకంబని ఎవడు చేయుచున్నాడో అట్టివానిత్యాగము సాత్త్వికత్యాగమని యెఱుగుము.

నద్వేష్ట్య కుశలంకర్మ కుశలేనానుషజ్జతే।
త్యాగిసత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10

సత్త్వసమావిష్టః-సత్త్వగుణముచేత వ్యాపించబడినవాడును; మేధావీ-ఆత్మజ్ఞానముగలిగినవాడును; ఛిన్నసంశయః- ఛేదింపబడిన సందేహముగలిగినవాడై; త్యాగీ- ఫలత్యాగియైనపురుషుడు; అకుశలం-అశుభకరమైన; కర్మ- కామ్యకర్మమును గూర్చి; నద్వేష్టి-ద్వేషింపడు; కుశలే - శుభకరమైనకర్మమందు, నానుషజ్జతే-ఆసక్తుడుకాడు.

సాత్త్విక త్యాగముగల ఆత్మజ్ఞాని సంశయంబులుమాని సుఖదుఃఖకరంబులైన నిత్యనైమిత్తిక కర్మలయందు స్నేహ ద్వేషములు వుంచడు.

నహి దేహభృతాశక్యం త్యక్తుంకర్మాణ్యశేషతః।
యస్తుకర్మఫలత్యాగీ సత్యాగీత్యభిధీయతే. 11

హి-ఏకారణమువలన; దేహభృతా- దేహాభిమానముగల వానిచేత; అశేషతః-సమస్తములయిన; కర్మాణి - కర్మములను; త్యక్తుం-విడుచుటకొఱకు; నశక్యం - శక్యముగాదో; యస్తు-ఎవ్వాఁడైతే; కర్మఫలత్యాగీ-కర్మఫలమును త్యజించుచున్నాఁడో; సః-వాఁడు; త్యాగీ-త్యాగముగలవాఁడని; అభిధీయతే-చెప్పఁబడుచున్నాఁడు.

శరీరధారి కర్మలను విడిచి నిర్వహింపలేఁడు గావున ఎవఁడు వేదోక్తములయిన కర్మలను ఆచరించి కర్మఫలమును త్యజించుచున్నాఁడో వాఁడే కర్మత్యాగియని చెప్పఁబడును.

అనిష్టమిష్టంమిశ్రంచ త్రివిధంకర్మణఃఫలమ్।
భవత్యత్యాగినాంప్రేత్య నతుసన్న్యాసినాంక్వచిత్. 12

అనిష్టం-ఇష్టముకానిదనిన్ని; ఇష్టం-ఇష్టమైనదనిన్ని; మిశ్రంచ-ఇష్టానిష్టమిశ్రమైనదనిన్ని; త్రివిధం-మూఁడువిధములుగలిగిన; కర్మణః-కర్మముయొక్క; ఫలం-ఫలమును; అత్యాగినాం-త్యజించనివారలకు; ప్రేత్య-జన్మాంతరమును పొంది; భవతి-అవుచున్నది; సన్న్యాసినాంతు-కర్మఫలత్యాగులకయితే; క్వచిదపి-ఒకప్పుడున్ను; భవతి-కాదు

కర్మఫలములు ప్రియములయినవి అప్రియములయినవి ప్రియాప్రియమిశ్రములైనవి అని మూఁడువిధములు. కర్మఫలత్యాగము

చేయనివారలు మరణాంతరములయందు ఆఫలములనుపొందుచు న్నవి. కర్మఫలత్యాగము చేసినవారలను ఆఫలములు జన్మాంతరములయందంటవు.

పంచైతానిమహాబాహో కారణానినిబోధమే।
సాంఖ్యేకృతాంతేప్రోక్తాని సిద్ధయేసర్వకర్మణామ్. 13

హే మహాబాహో-ఓయి అర్జున! సర్వకర్మణాం-సమస్తకర్మములయొక్క; సిద్ధయే-సిద్ధికొరకు; కృతాంతే-సిద్ధాంతమందును; సాంఖ్యే-సాంఖ్యశాస్త్రమందున్న; ప్రోక్తాని-చెప్పబడిన; ఏతాని-ఈ; పంచ-అయిదయిన; కారణాని-హేతువులను; మే-నాయొక్క (వాక్కువలన); నిబోధ-తెలియుము.

ఓ అర్జున! వేదాంతమునందు ఎల్ల కర్మల సిద్ధికొఱకు చెప్పియుండు అయిదు హేతువులను నీకు జెప్పెద వినుము,

అధిష్ఠానంతథాకర్తా కరణంచపృథగ్విధమ్।
వివిధాచపృథక్చేష్టా దైవంచైవాత్రపంచమమ్. 14

అధిష్ఠానం-దేహమును; తథా-అలాగుననే; కర్తా-అహంకారమును; పృథగ్విధం - నానాప్రకారమైన; కరణం - శ్రోత్రాదికరణమును; వివిధాచ-నానావిధమైన; పృథక్చేష్టా-వేర్వేరైన ప్రాణాపానాదివ్యాపారమును; అత్ర-ఈకారణములయందు; పంచమం-అయిదవది; దైవంచ-సూర్యాద్యధిదైవమును.

శరీరము అహంకారము ఇంద్రియములు పంచ ప్రాణముల వ్యాపారము వీట్లఅభిమాని దేవతల ప్రేరేపణ అని ఈవిధముగ అయిదు కారణములున్నవి.

శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. 15

నరః-మనుష్యుడు; శరీరవాఙ్మనోభిః-మనోవాక్కాయములచేత; యత్కర్మ-ఏకర్మమును; న్యాయ్యం వా-మంచిదైనను; విపరీతం వా-అన్యాయమైనదైనను; ప్రారభతే- ఉపక్రమించుచున్నాడో; తస్య- ఆకర్మమునకు; ఏతే పంచ- ఈఅధిష్ఠానాదులైదును; హేతవః-కారణములు.

త్రికరణములైన మనస్సు, వాక్కు కాయములతో గూడి నమంచికర్మనైనా చెడుకర్మనైనా మనుష్యుడు ప్రారంభించునప్పుడు ఆత్మకు పై జెప్పిన అయిదును కారణములని తెలియుము.

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః. 19

తత్ర-ఆకర్మమందు (కారణము); ఏవం సతి - ఇట్లుండగా; యః-ఎవ్వడు; ఆత్మానం-కేవలం తన్నే; కర్తారం-కర్తగాను; పశ్యతి-చూచుచున్నాడో; సః-వాడు; దుర్మతిస్సః- చెడినబుద్ధిగలవాడై; అకృతబుద్ధిత్వాత్-ఆచెడుబుద్ధిగలుగుటవలన; న

పశ్యతి-ఆత్మతత్త్వమునుచూడడు.

ప్రతికర్మకు కారణభూతమైన కారణములు పై చెప్పిన విధముగా అయిదుఉండగా ఎవడైతే కర్మకు తానే కర్తయని యెంచుచున్నాడో వాడు తెలివిగలవాడుకాజాలాడు, అట్టి అజ్ఞాని ఆత్మ తత్వమును యెఱుగజాలడు.

యస్యనాహంకృతోభావో బుద్ధిర్యస్యనలిప్యతే।
హత్వాపిసయిమాంల్లోకాన్ నహంతిననిబధ్యతే. 17

యస్య-ఏపురుషునికి; అహంకృతః-నేనసెడి; భావః - భావము; నాస్తి- లేదో; యస్య - ఎవనియొక్క; బుద్ధిః- బుద్ధి; నలిప్యతే-లిప్తముగాదో; సః-వాడు; ఇమాంల్లోకాన్ - ఈజనులను; హత్వాపి - చంపిన్ని; నహంతి - చంపనివాడుకాడు; ననిబధ్యతే-బద్ధుడునుకాడు.

ఎవడైతే తానసే అహంకారముజెందక కర్మఫలమందుఆసక్తిలేకయున్నాడో అట్టివాడు ఈ జనులనందఱిని సంహరించినసాడైనా చంపినవాడు కాజాలడు వానికి అకర్మఫలమున్ను అంటదు.

జ్ఞానంజ్ఞేయంపరిజ్ఞాతా త్రివిధాకర్మచోదనా।
కరణంకర్మకర్తేతి త్రివిధఃకర్మసంగ్రహః. 18

కర్మచోదనా-కర్మోపదేశము; జ్ఞానమితి- జ్ఞానమనిన్ని;

యమితి-తెలియదగినదన్ని; పరిజ్ఞాతా-తెలిసినవాడన్ని;
త్రివిధా-మూడువిధములుగలది; కర్మసంగ్రహః - కర్మసంగ్ర
హము; కరణం - కరణమన్ని; కర్మ కర్మమన్ని; కర్తేతి-
కర్తయన్ని; త్రివిధః-మూడువిధములుగలది.

కర్మోపదేశము మూడురూపములు గలిగి యున్నది. అవి
యేవన్న జ్ఞానము జ్ఞానమువల్ల తెలియదగిన విషయము జ్ఞాన
ము గలవాడు. కర్మయును మూడు రూపములుగలదియే అవి
కర్మకు ఫలమును పదార్థములను సంపాదించుట కరణమనియు, చే
యుట కర్మయనియు, చేయువాడు కర్తయనియు మూడు రూ
పములుగ యున్నది.

జ్ఞానంకర్మచకర్తాచ త్రిధైవగుణభేదతః।
ప్రోచ్యతేగుణసంఖ్యానే యథావచ్ఛృణుతాన్యపి. 19

గుణసంఖ్యానే-కపిలాదిశాస్త్రమందు; జ్ఞానంచ-జ్ఞానమును;
కర్మచ-క్రియయు; కర్తాచ-కర్తయు; గుణభేదతః - సత్వరజ
స్తమోగుణభేదమువలన; త్రిధైవ - మూడుప్రకారములుగా;
ప్రోచ్యతే-చెప్పబడుచున్నది; తాన్యపి - అజ్ఞానాదులను; యు
థావత్ - యథాశాస్త్రముగా; శృణు- వినుము.

శాస్త్రములలో జ్ఞానమును, కర్మను, కర్తను, సత్వరజస్త
మోగుణభేదములచే ఒకటొకటి మూడుమూడు రూపములు

గలదిగా చెప్పచున్నది వానినిన్ని సాంఖ్యశాస్త్రోక్తరీతిగవినుము॥

సర్వభూతేషుయేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తంవిభక్తేషు తజ్జ్ఞానంవిద్ధిసాత్త్వికమ్. 20

యేన-ఏజ్ఞానముచేత; విభక్తేషు-భిన్నములైన; సర్వభూతేషు-సర్వభూతములయందును; అవిభక్తం - అఖండమైనదియును, అవ్యయం - నాశరహితమయినదియును, ఏకం- ఒక్కటైనదియునైన; భావం - పరమాత్మస్వరూపమును; ఈక్షతే- చూచుచున్నాడో, తద్జ్ఞానం-ఆజ్ఞానమును; సాత్త్వికం-సత్త్వగుణమువలన పుట్టినదానినిగా; విద్ధి-తెలియుము.

ప్రత్యేక రూపములయిన బ్రహ్మాది పిపీలికాంత జంతువుల యందును స్థావరములయందును అఖండమైనట్టిన్ని నాశరహితమైనట్టిన్ని ఒకటైన బ్రహ్మభావమును జ్ఞానముచేత ఎవఁడుచూచుచున్నాడో వానిజ్ఞానము సాత్త్వికజ్ఞానమని యెఱుఁగుము.

పృథక్త్వేనతుయద్జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్।
వేత్తిసర్వేషుభూతేషు తజ్జ్ఞానంవిద్ధిరాజసమ్. 21

యద్జ్ఞానం - ఏజ్ఞానము (చేతననుట); సర్వేషుభూతేషు-సమస్తభూతములయందును; పృథక్త్వేన - భేదభావముచేత; పృథగ్విధాన్ - భిన్నప్రకారములైనవానినిగా; నానావిధాన్-

నానాభావములైనవానినిగా; వేత్తి- తెలియుచున్నాడో; తద్ జ్ఞానం- ఆజ్ఞానమును; రాజసం- రజోగుణసంబంధమైనదా నినిగా; విద్ధి- తెలియుము.

ఎల్లభూతములయందు భేద భావముచేత భిన్నప్రకారము లయినదిగానున్న పరబ్రహ్మను జ్ఞానముచేత ఎవడు తెలిసికొనుచున్నాడో, వాని జ్ఞానము రాజసజ్ఞానమని తెలియుము.

యత్తుకృత్స్నవదేకస్మి న్కార్యేసక్తమహైతుకమ్।
అతత్త్వార్థవదల్పంచ తత్తామసముదాహృతమ్. 22

యద్ జ్ఞానం- ఏజ్ఞానము; యేకస్మిన్- ఒకటైన; కార్యే- ప్రతిమాదిరూపమందు; సక్తంసత్- కూడినదై, కృత్స్నవత్- సర్వవిషయమయినదానివలెనున్నదో; అహైతుకం- కారణము లేని; అల్పంచ- తుచ్ఛఫలప్రదమైన; అతత్త్వార్థవత్- యథార్థముగానట్టి; తత్ జ్ఞానం- ఆజ్ఞానము, తామసం- తమోజనిత మైనదని; ఉదాహృతం- చెప్పబడెను.

జీవుని దేహ పరిమాణము గలవాడుగా నన్ను, ఈశ్వరుని దారుపాషాణమాత్ర పరిమాణము గలవాడుగానున్న తెలియుట యుక్తిహీనమైనట్టిన్ని యథార్థము గానిదైనట్టిన్ని అల్ప విషయఫలము గలిగినట్టి తామస జ్ఞానమని చెప్పబడును.

నియతంసంగరహితమరాగద్వేషతఃకృతమ్।

అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే. 23

యత్కర్మ-ఏకర్మము; నియతం-నిత్యమయినదై; సంగరహితం-ఆసక్తిరహితమయినదై; అఫలప్రేప్సునా- ఫలాపేక్షలేనివానిచేత; అరాగద్వేషతః - రాగద్వేషరాహిత్యంబుగలదై; కృతం-చేయబడునో; తత్-ఆకర్మము; సాత్త్వికం-సత్త్వగుణసంబంధమైనదని; ఉచ్యతే-చెప్పబడుచున్నది.

ఏకర్మ శాస్త్రసమ్మతమైనదై నిత్యమైనదై సంగరహితమైనదై ఫలాపేక్షలేనివానిచే రాగద్వేషములులేక చేయబడుచున్నదో అట్టి కర్మను సత్త్వగుణప్రధానమని చెప్పుదురు.

యత్తుకామేప్సునాకర్మ సాహంకారేణవాపునః ।
క్రియతేబహులాయాసం తద్రాజసముదాహృతమ్. 24

కామేప్సునా-కోరికనుబొంద నిచ్ఛయించిన కర్తచేత; సాహంకారేణవా - అహంకారముతో గూడుటచేతను; బహులాయాసం-అధికమైన క్లేశముగలిగిన; యత్కర్మతు-ఏకర్మమయితే; క్రియతే - చేయబడుచున్నదో; తత్పునః-ఆకర్మము; రాజసమితి-రజోగుణమువలనబుట్టినదని; ఉదాహృతం-చెప్పబడెను.

ఎవడైతే కోరికలుగలిగి అహంకారముతో గూడుకొని మిగుల నష్టమునిచ్చు కర్మలను జేయుచున్నాడో వాడుచేసెడి కర్మ రాజసప్రధానమనిచెప్పబడును.

**అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్।**
**మోహాదారభ్యతే కర్మ తత్తామసముదాహృతమ్. 25**

అనుబంధం-ముందుగలిగెడి కార్యమును; క్షయం - నాశ
మును; హింసా-పీడను; పౌరుషం - సామర్థ్యమును; అనపే
క్ష్య చ-విచారించక; మోహాత్-అజ్ఞానమువలన; యత్కర్మ-
ఏకర్మము; ఆరభ్యతే-ఆరంభింపబడుచున్నదో; తత్-ఆకర్మ
ము; తామసం-తామసమని; ఉదాహృతం-చెప్పబడెను.

అహంకారముతో గూడుకొని అందున కలిగెడి శుభాశు
భములను నాశమును ఇతరులకు గలుగు హింసయును నెరవే
ర్చుటకు తనకుగల శక్తిని యోచించక అవివేకమున జేయబడు
కర్మ తామసప్రధానమైన కర్మ మని చెప్పబడును.

**ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।**
**సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26**

ముక్తసంగః-విడువబడిన ఆసక్తిగలిగినవాడును; అనహం
వాదీ- అహంవాదికానట్టివాడును; ధృత్యుత్సాహ సమన్వితః-
ధైర్యోత్సాహములతోగూడినవాడును; సిద్ధ్యసిద్ధ్యోః - ప్రా
ప్త్యప్రాప్తులయందు; నిర్వికారః-వికారములేనివాడునైన; క
ర్తా-కర్త; సాత్త్వికః-సాత్త్వికుడని; ఉచ్యతే- చెప్పబడు
చున్నాడు.

దారాపత్యాదులయిన విషయములయందు ప్రీతి లేక, అ
హంకారరహితుడై ధైర్య ఉత్సాహములతో గూడి సిద్ధి అసి
ద్ధులయందు లక్ష్యము లేకయుండు కర్త సాత్వికు డనబడును.

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకో௨శుచిః।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

రాగీ-అనురాగముగలిగినవాడును; కర్మఫలప్రేప్సుః-కర్మ
ఫలమును బొంద నిచ్ఛయించినవాడును; లుబ్ధః-ద్రవ్యాభిలాషి
యైనవాడును: హింసాత్మకః-పరులకుబీడ జేయు స్వభావము గ
లిగినవాడును; అశుచి.-ఆచారవర్జితుడైనవాడును; హర్ష
శోకాన్వితః - సంతోషదుఃఖములతో కూడినవాడును నైన; క
ర్తా-కర్త; రాజసః-రాజసుడని: పరికీర్తితః- చెప్పబడెను.

ప్రీతితో కర్మఫలమును పొంద నిచ్ఛయించి ద్రవ్యకాంక్ష
గలిగి ఇతరులను హింసచేయు ప్రకృతితో గూడుకొని ఆచార
ములేనివాడై దుఃఖ సంతోషములకు లోబడిన కర్త రాజసు
డని చెప్పబడును.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికో௨లసః।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28

అయుక్తః-మనోనిగ్రహము లేనట్టిన్ని; ప్రాకృతః - బుద్ధిహీ
నుడైనట్టిన్ని; స్తబ్ధః-స్తబ్ధుడైనట్టిన్ని; శఠః-మాయావియైనట్టిన్ని;

నైష్కృతికః-పరులనవమానించునట్టిన్ని; అలసః - మందుడైనట్టి న్ని; విషాదీ-దుఃఖశీలుడైనట్టిన్ని; దీర్ఘసూత్రీచ- ఆలస్యము గాపనులుచేయునట్టి; కర్తా- కర్త; తామసః- తామసుడని; ఉ చ్యతే-పలుకబడుచున్నాడు.

మనస్థైర్యములేక అవివేకుడై స్తబ్ధుడై మాయావియై ఇ తరుల అవమానము చేసెడి ప్రకృతిగలిగి మందుడై దుఃఖ శీ లుడై ఆలస్యముతో కర్మనుచేయువాడు తామసుడనబడును.

బుద్ధేర్భేదంధృతేశ్చైవ గుణతస్త్రివిధంశృణు।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేనధనంజయ. 29

హే ధనంజయ-ఓయి అర్జునా! అశేషేణ-నిశ్శేషముగా; పృథక్త్వేన-వేరుపరచుటచేత; ప్రోచ్యమానం-చెప్పబడుచున్న దియును; గుణః-సత్త్వాదిగుణములవలన; త్రివిధం-మూడుప్ర కారములుగలిగినట్టి; బుద్ధేశ్చ-బుద్ధియొక్కయు; ధృతేశ్చ- ధై ర్యముయొక్కయు; భేదం-భేదమును; శృణు-వినుము.

ఓ అర్జున! తెలివియు ధైర్యమును గుణభేదములచే త్రివి ధములయియున్నవి. వానిని నిస్సందేహముగా వేరుపరచి చెప్పెదను వినుము.

ప్రవృత్తించనివృత్తించ కార్యాకార్యేభయాభయే।
బంధంమోక్షంచయావేత్తి బుద్ధిస్సాపార్థసాత్త్వికీ. 30

హే పార్థ-ఓయి అర్జున! యా బుద్ధిః-ఏబుద్ధి; ప్రవృత్తించ-కర్మమార్గమును; నివృత్తించ-మోక్షమార్గమును; కార్యాకార్యే- కర్తవ్యాకర్తవ్యములను; భయాభయే- భయాభయములను; బంధం-బంధకమును; మోక్షంచ-మోక్షమును; వేత్తి-తెలియుచున్నదో; సా-ఆబుద్ధి; సాత్త్వికీ-సత్త్వగుణము వలనకలిగినది.

ఓఅర్జున! కర్మమార్గమును మోక్షమార్గమును కర్తవ్యాకర్తవ్యములను భయాభయములను బంధమోక్షములను ఏజ్ఞానము తెలుసుకొనుచున్నదో అజ్ఞానము సత్త్వగుణముచే పుట్టినదని తెలియఁగను.

యయా ధర్మమధర్మంచ కార్యంచాకార్యమేవచ।
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ. 31

హే పార్థ-ఓయి అర్జున! యయా-ఏబుద్ధిచేత, ధర్మంచ-ధర్మమును; అధర్మంచ-అధర్మమును; కార్యంచ-చేయదగినదానిని; అకార్యమేవచ చేయరానిదానిని, అయథావత్-యథార్థముగానట్లుగా; ప్రజానాతి-తెలియుచున్నదో; సా-ఆబుద్ధి; రాజసీ-రాజసమైనది.

ఓ పార్థ! ధర్మాధర్మములయొక్కయు, కార్యాకార్యములయొక్కయు నిశ్చయమును తెలియఁజాలని తెలివి రజోగుణముచే గలిగినదని యెఱుఁగుము.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ॥ 32

హే పార్థ-ఓయి అర్జునా! యా బుద్ధిః-ఏబుద్ధి, తమసా-తమస్సుచేత; ఆవృతా-కప్పబడినదై; అధర్మం-నిషిద్ధధర్మము ను; ధర్మం-యుక్తధర్మముగా; సర్వార్థాన్ - సమస్తపదార్థములను; విపరీతాన్ - ప్రతికూలములను; మన్యతే - తలంచుచున్నదో; సా-ఆబుద్ధి; తామసీ-తామసమాయినది.

ఓ అర్జున!. అవివేకము మూయబడి నిషిద్ధధర్మములను, శాస్త్రీయములయినవి యనిన్ని ఎల్ల పదార్థములను వ్యత్యస్తము లుగాను తలచెడిబుద్ధి తామసగుణముచే గలిగినది.

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ॥ 33

హే పార్థ - ఓయి అర్జునా! యోగేన-యోగముచేత; అవ్యభిచారిణ్యా-వ్యభిచారిగానట్టి; యయా ధృత్యా-ఏధైర్య ముచేత; మనఃప్రాణేంద్రియక్రియాః- మనఃప్రాణేంద్రియములక్రియలు; ధారయతే-నియమింపబడుచున్నవో; సా-ఆధైర్యము; సాత్త్వికీ-సాత్త్వికమైనది.

ఓ అర్జున! ఎవడైతే మనస్సు, ప్రాణములు, ఇంద్రియములు, వీట్లయొక్క వ్యాపారములను నిశ్చలమైన యోగముచేత

నియమింపుచున్నాడో వాని ధైర్యము సాత్వికధైర్యము.

యయాతుధర్మకామార్థాన్ ధృత్యాధారయతేర్జున।
ప్రసంగేనఫలాకాంక్షీ ధృతిస్సాపార్థరాజసీ. 34

హే పార్థ—ఓయి అర్జునుడా! ఫలాకాంక్షీ- ఫలమును గోరుచున్నపురుషుడు; ప్రసంగేన - ఆసక్తిచేత; ధర్మకామార్థాన్—ధర్మార్థకామములను; యయాధృత్యా- ఏధైర్యము చేత; ధారయతే-ధరించుచున్నాడో; సా- ఆధైర్యము; రాజసీ- రాజసమయినది.

ఓ పార్థ! ఎవడైతే ఫలాపేక్షతో శ్రద్ధతో ధర్మార్థ కామ మోక్షములను సర్వదాకోరుచున్నాడో వానిధైర్యము రాజస ధైర్యము.

యయాస్వప్నంభయంశోకం విషాదంమదమేవచ।
నవిముంచతిదుర్మేధా ధృతిస్సాపార్థతామసీ. 35

హే పార్థ—ఓయి అర్జునుడా! దుర్మేధాః- కుత్సితబుద్ధిగలపురుషుడు; యయా—ఏధైర్యముచేత; స్వప్నం - నిద్రయును; భయం—భీతియును; శోకం-దుఃఖంబును; విషాదం—దిగులును; మదమేవచ-మదంబును; నవిముంచతి—విడువడో; సా- ఆ ధైర్యము; తామసీ-తామసమైనది.

ఓ అర్జున! కుత్సితబుద్ధిగల మనుష్యుడు ఏ ధైర్యము వల్ల

నిద్రను, భయమును, దుఃఖమును, చింతను, గావరమును విడ
వలేడో అట్టి ధైర్యము తామసధైర్యము.

సుఖంత్విదానీం త్రివిధం శృణుమే భరతర్షభ।
అభ్యాసాద్రమతేయత్ర దుఃఖాంతంచ నిగచ్ఛతి॥ 36
యత్తదగ్రేవిషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖంసాత్త్వికంప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్॥ 37

హే భరతర్షభ-ఓయి అర్జున! త్రివిధం - మూడువిధ
ములుగలిగిన; సుఖం-సుఖమును; ఇదానీం- ఇప్పుడు; మే నా
యొక్క (వాక్యవలన); శృణు-వినుము; యత్ర - ఏసుఖాను
భవమందు; అభ్యాసాత్-అభ్యాసమువలన; రమతే-క్రీడించు
చున్నాడో; దుఃఖాంతంచ-దుఃఖనాశనమును; నిగచ్ఛతి-పొం
దుచున్నాడో; యత్తత్-ఏయాసుఖము; అగ్రే-తొలుత; విష
మివ-విషమువలెను; పరిణామే-అంతమందు;అమృతోపమం-
అమృతతుల్యమును; భవతి- అగుచున్నదో; ఆత్మబుద్ధిప్రసాద
జం-స్వబుద్ధినైర్మల్యమువలనబుట్టిన; తత్సుఖం-ఆసుఖము; సా
త్త్వికం-సాత్త్వికము; ప్రోక్తం-చెప్పబడెను.

ఓ పార్థ! సుఖమున్ను గుణ సంబంధముగలిగి త్రివిధములు
గానున్నయది, వానిని తెలియజెప్పుచున్నాను, వినుము. ఏసు
ఖానుభవమునందు అభ్యాసము వలన క్రీడించుచున్నాడో, ఏ

సుఖ దుఃఖములను పోగొట్టునో ఏ సుఖము మొదట విషయమువలెనుండి తుదిలో అమృతముతో సమానముగానుండునో అట్టి తన బుద్ధినైర్మల్యముచే కలిగిన సుఖము సాత్త్విక సుఖము.

విషయేంద్రియసంయోగా ద్యత్తదగ్రే మృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38

విషయేంద్రియసంయోగాత్ -విషయేంద్రియములసంబంధమునలన; యత్తత్ - ఏ ఆసుఖము; అగ్రే-మొదటను; అమృతోపమం - అమృతతుల్యమును; పరిణామే-అంతమందు; విషమివ-విషమువలెను; భవతి-అగుచున్నదో; తత్సుఖం- ఆసుఖము, రాజసం - రాజసముమనదని; స్మృతం-చెప్పబడెను.

విషయేంద్రియ సంబంధముగలిగి మొదట అమృతముగాను కడపటవిషముగాను వుండు సుఖము రాజస సుఖము.

యదగ్రేచానుబంధేచ సుఖంమోహనమాత్మనః।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్.

యత్ -ఏసుఖము; అగ్రే-అనుభవకాలమందును, అనుబంధేచ-విపాకమందును; ఆత్మనః తనకు; మోహనం - మోహింపజేయునదో; నిద్రాలస్యప్రమాదోత్థం-నిద్రాలస్యప్రమాదములవలనబుట్టినది, తత్ -ఆసుఖము; తామసం-తామసమని, ఉదాహృతం-చెప్పబడెను.

నిద్రచే ఆలస్యముచే ఎచ్చరిక లేని వానిచే కల్పింపబడినదియును మొదటను తుదను ఆత్మకు భ్రాంతిపుట్టించునదియు. అట్టిసుఖము తామససుఖమని చెప్పుదురు.

నతదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః. 40

యత్సత్త్వం-ఏ ప్రాణిజాతము; ప్రకృతిజైః - మాయవలన బుట్టిన; ఏభిస్త్రిభిర్గుణైః-ఈమూడుగుణములచేత;విముక్తం-విడువబడినది; స్యాత్-అగునో; తత్-ఆప్రాణివలన; పృథివ్యాం వా-భూమియందలి (మనుష్యులయందైనను); దివి; స్వర్గమందు; దేవేషువా - దేవతలయందైనను; నాస్తి-లేదు.

ప్రకృతిచే జనించిన ఈ సత్త్వాది గుణములకు లోబడని ప్రాణి మానుషలోకమందుగాని దేవలోకమందుగాని పాతాళలోకమందుగాని లేదు.

బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. 41

హే పరంతప-ఓయి అర్జునా! బ్రాహ్మణక్షత్రియవిశాం-బ్రాహ్మణక్షత్రియవైశ్యులకును; శూద్రాణాం చ - శూద్రులకును; కర్మాణి-క్రియలు; స్వభావప్రభవైః-ప్రకృతివలనబుట్టిన;గుణైః-సత్త్వాదిగుణములచేత;ప్రవిభక్తాని-విభజింపబడినవి.

ఓ అర్జునా! బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర జాతులకు శాస్త్రీయమైన కర్మలు వారివారి ప్రకృతివలన బుట్టిన సత్త్వాది గుణములను అనుసరించి ఏర్పరచబడియున్నది.

శమోదమ స్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవచ।
జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మ స్వభావజమ్. 42

శమః-అంతరింద్రియనిగ్రహమును; దమః- బహిరింద్రియ నిగ్రహమును; తపః-తపస్సును; శౌచం-శుచిత్వమును; క్షాంతిః-ఓర్పును; ఆర్జవం- ఋజుత్వమును; జ్ఞానం- జ్ఞానమును; విజ్ఞానం-అనుభవజన్యజ్ఞానమును; ఆస్తిక్యం- కలదనినమ్మటయును; బ్రాహ్మం - బ్రహ్మసంబంధమైన; స్వభావజం- స్వభావమువలనబుట్టిన; కర్మ-కర్మము.

లోపలి ఇంద్రియముల నిగ్రహము బహిరింద్రియ నిగ్రహము తపస్సు శుద్ధి ఓర్పు నిర్వక్రత్వము శాస్త్రీయ జ్ఞానము అనుభవజ్ఞానము ఈశ్వరుడు కలడను నమ్మిక ఇవియున్నియు బ్రాహ్మణులకు స్వభావముచే బుట్టినకర్మలు.

శౌర్యంతేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్।
దానమీశ్వరభావశ్చ క్షాత్రంకర్మస్వభావజమ్. 43

శౌర్యం- శూరత్వమును; తేజః-ప్రాగల్భ్యమును; ధృతిః- ధైర్యమును; దాక్ష్యం- సామర్థ్యమును; యుద్ధే యుద్ధము

ను; అపలాయనంచ - పారిపోకయుండుటయు; దానం - ఇచ్చుటయు; ఈశ్వరభావశ్చ - సకలజనులనేలుటయు; ఏతత్ - ఇది; క్షాత్రం - క్షత్రసంబంధమైన; స్వభావజం - స్వభావమువలన బుట్టిన; కర్మ - కర్మము.

శౌర్యము తేజస్సు ధైర్యము సామర్థ్యము యుద్ధమునం దుపయుక్తకుండుట దానము దొరతనము యివి క్షత్రియులకు స్వాభావికకర్మలు.

కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్యంకర్మస్వభావజమ్।
పరిచర్యాత్మకంకర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44

కృషిగోరక్షవాణిజ్యం - కృషి, దున్నుటయు; గోరక్ష - గోసంరక్షణజేయుటయు; వాణిజ్యం - వ్యాపారము జేయుటయు; వైశ్యం - వైశ్యసంబంధమైన; స్వభావజం - స్వభావమువలనబుట్టిన; కర్మ - కర్మము; పరిచర్యాత్మకం - సేవారూపమైన; కర్మ - కర్మము; శూద్రస్య - శూద్రునికి; స్వభావజం - స్వభావజన్యమైనది

దున్నుట, గో సంరక్షణము, వ్యాపారము ఇవి వైశ్యులకు స్వాభావికకర్మలు. సేవ శూద్రులకు స్వాభావిక కర్మ.

స్వేస్వేకర్మణ్యభిరతః సంసిద్ధింలభతేనరః।
స్వకర్మనిరతస్సిద్ధిం యథావిందతితచ్ఛృణు. 45

నరః-మానవుడు; స్వేస్వేకర్మణి - తనతనకర్మమందు; అభిరతస్సన్-ఆసక్తుడైనవాడై; సంసిద్ధిం-సిద్ధిని; లభతే-పొందుచున్నాడు; స్వకర్మనిరతః-స్వకీయకర్మమందాసక్తుడైనవాడు; యథా-ఏప్రకారముగా; సిద్ధిం-సిద్ధిని; విందతి-పొందుచున్నాడో; తత్-ఆకర్మవిధానమును; శృణు-వినుము.

మానవులు తమతమ జాతి ధర్మములయిన కర్మలయందాసక్తి గలిగి ఏవిధముగ సిద్ధిని జెందుచున్నారో ఆక్రమమును తెలియజెప్పుచున్నాను వినుము.

యతః ప్రవృత్తిర్భూతానాం యేనసర్వమిదంతతం।
స్వకర్మణాతమభ్యర్చ్య సిద్ధింవిందతిమానవః. 46

యతః-ఏ ఈశ్వరునివలన; భూతానాం-ప్రాణులయొక్క; ప్రవృత్తిః-ఉత్పత్తి; భవతి-అగుచున్నదో; యేన-ఏ ఈశ్వరుని చేత; ఇదంసర్వం-ఈసమస్తమైనజగత్తును; తతం-వ్యాపించబడెనో; మానవః-మనుష్యుడు; స్వకర్మణా - స్వకీయకర్మముచేత; తం-ఆ ఈశ్వరుని; అభ్యర్చ్య-పూజించి; సిద్ధిం- యోగ్యతను; విందతి-పొందుచున్నాడు.

ఏ ఈశ్వరునివలన ఎల్ల ప్రపంచము జనించుచున్నదో ఎవనిచే ఈ ఎల్లప్రపంచములు వ్యాపింపబడియున్నవో అట్టిఈశ్వరుని మనుష్యులు వారివారి స్వకీయ కర్మానుష్ఠానములచే కొలిచి

ఓయి కౌంతేయ! దోషయుక్తమైనను స్వభావజన్యమైనకు లధర్మములను విడువకూడదు. ఎందువల్లననగా అగ్నిని పొగ కప్పినరీతి ఎల్లకర్మలను దోషము చుట్టుకొనియున్నది.

అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధింపరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి. 49

సర్వత్ర-సమస్తమందును; అసక్తబుద్ధిః- సంగరహితబుద్ధి గలిగిన; జితాత్మా-జయింపబడిన మనస్సుగలిగిన; విగతస్పృహః-ఉడిగినయాశలుగలిగినట్టివాడు; సన్న్యాసేన - కర్మఫల త్యాగముచేత; పరమాం-ఉత్కృష్టమైన; నైష్కర్మ్యసిద్ధిం-నిష్క్రియత్వసంసిద్ధిని; అధిగచ్ఛతి-పొందుచున్నాడు.

ఎవడైతే ఎల్లప్రపంచమందాశవిడిచి మనస్సు స్వాధీనము చేసుకొని సకల ఆశలువదలి కర్మఫలత్యాగము చేయుచున్నాడో అతడు ఉత్కృష్టమైన నైష్కర్మ్యసిద్ధినిపొందుచున్నాడు.

సిద్ధిం ప్రాప్తోయథా బ్రహ్మ తథాప్నోతి నిబోధమే।
సమాసేనైవ కౌంతేయ నిష్ఠాజ్ఞానస్య యాపరా. 50

హే కౌంతేయ- ఓయి అర్జునా! సిద్ధిం-యోగ్యతను; ప్రాప్తః-పొందినవాడు; బ్రహ్మ-పరమాత్మను; యథా - ఏప్రకారముగా; పరా-ఉత్కృష్టమయిన; జ్ఞానస్య - జ్ఞానముయొక్క; నిష్ఠా-నిష్ఠ; యా-ఏదికలదో ఆనిష్ఠను; సమాసేన-సంక్షేపము

చేత: మే-నా యొక్క (వాక్యమువలన), నిబోధ-తెలిసికొనుము.

ఓ అర్జునా! నిష్కర్మసిద్ధిని బొందిన పిదప పరబ్రహ్మమును పొందుటకు శ్రోతవ్యమైన దిక్కిలి శ్రేష్ఠమైన జ్ఞాననిష్ఠను నీకు సూక్ష్మముగా జెప్పెద వినుము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ।
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. 51

విశుద్ధయా-మాయారహితమైన; బుద్ధ్యా-బుద్ధితోడ, యుక్తః-కూడినవాడై; ధృత్యా-ధైర్యముచేత, ఆత్మానం-ఆత్మను, నియమ్య చ-వశీకరణము చేసికొని; శబ్దాదీన్-శబ్దము మొదలగు, విషయాన్-విషయములను, త్యక్త్వా-విడిచి, రాగద్వేషౌ-రాగద్వేషములను, వ్యుదస్య చ-విడిచియు.

మాయారహితమైన బుద్ధితోకూడి ధైర్యముతో మనస్సును నిలిపి శబ్దస్పర్శరసరూపగంధవిషయములను పారద్రోలి రాగద్వేషములను వదలవలెను.

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. 53

వివిక్తసేవీ-రహస్యస్థలమందున్నవాడై లఘ్వాశీ-లఘు

సర్వవ్యాపిగానున్న, సచ్చిదానంద రూపుడనైనను, ఉండే నన్ను మిగులభక్తిచే తెలిసికొనినవాడు ఆత్మజ్ఞాన పరిసమాప్తి దినములయందు నాయందే ప్రవేశించుచున్నాడు.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్. 56

మద్వ్యపాశ్రయః-నేనే ప్రాప్యస్థానముగా గలిగినవాడు; సదా-ఎల్లప్పుడును; సర్వకర్మాణి- సమస్తకర్మములను; కుర్వాణః-చేయుచున్నవాడయి; మత్ప్రసాదాత్-నాయనుగ్రహము వలన; అవ్యయం-నాశరహితమయిన; శాశ్వతం - స్థిరమైన; పదం-పరమపదము; అవాప్నోతి-పొందుచున్నాడు.

నన్నే ప్రాప్యస్థానముగా తలచి వేదోక్తమైన ఎల్ల నిత్యనైమిత్తికకర్మలను చేయువాడు నా యనుగ్రహమువలన నాశరహితమైన మోక్షము పొందుచున్నాడు.

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ. 57

(కావుననీవు), చేతసా-వివేకబుద్ధిచేత; సర్వకర్మాణి - సమస్తకర్మములను; మయి-నాయందు; సన్న్యస్య-ఉంచి; మత్పరః-నేనే యుత్కృష్టముగా గలవాడవై; బుద్ధియోగం - బుద్ధియోగమును; ఉపాశ్రిత్య-ఆశ్రయించి; సతతం - ఎల్లప్పుడు; మచ్చిత్తః-నాయందుమనస్సుగలవాడవు; భవ-కమ్ము

కావున నీవు బుద్ధియోగముచే ఎల్ల కర్మఫలములను నాకు అరగింపుచేసి నన్నే ఉత్కృష్టగతియని నమ్మి బుద్ధియోగము చేత ఎల్ల కాలములయందును నాయందే మనస్సు గలవాడవై యుండుము.

మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. 58

మచ్చిత్తః-నాయందేమనస్సుగలిగిన; త్వం- నీవు; మత్ప్రసాదాత్-నాయనుగ్రహమువలన; సర్వదుర్గాణి- సమస్తదుఃఖములను; తరిష్యసి-అతిక్రమించగలవు; అథ-ఆతర్వాత; త్వం-నీవు; అహంకారాత్-గర్వమువలన, నశ్రోష్యసిచేత్-వినకపోతివాయేని; వినఙ్క్ష్యసి-చెడిపోగలవు.

నాయందు నీ మనస్సులయించినట్లైతే నా అనుగ్రహము వలన ఎల్ల దుఃఖములు నీకుతొలగిపోవును. లేక అహంకారము పొంది నా పలుకులను వినకపోతివేని నీవు నశించిపోదువు.

యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతిమన్యసే।
మిథ్యైషవ్యవసాయస్తే ప్రకృతిస్త్వాంనియోక్ష్యతి. 59

అహంకారం-అభిమానమును; ఆశ్రిత్య - ఆశ్రయించి, న యోత్స్య ఇతి-యుద్ధముచేయనని; మన్యసేయది- తలంచితివా యేని; ఏషః-ఈ; తే-నీయొక్క; వ్యవసాయః - నిశ్చయము;

విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63

ఇతి-ఈప్రకారముగా; తే-నీకొఱకు; మయా-నాచేత; గుహ్యాత్-గోప్యమునకంటె; గుహ్యతరం-మిక్కిలిగోప్యమైన; జ్ఞానం-జ్ఞానము; ఆఖ్యాతం-చెప్పబడెను; ఏతత్-ఈ జ్ఞానశాస్త్రమును; అశేషేణ-సాకల్యముగా; విమృశ్య-విచారించి; యథా-ఏప్రకారముగా; ఇచ్ఛసి-ఇచ్ఛయించుచున్నావో; తథా-ఆ ప్రకారముగా; కురు-చేయుము.

ఈ ప్రకారము నీకొఱకు రహస్యములలో పరమ రహస్యమైన జ్ఞానమును తెలియజెప్పితిని దానినివివరముగా యోచించి నీఇష్టప్రకారము చేయుము.

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. 64

భూయః-తిరిగి; సర్వగుహ్యతమం-సమస్తములయందుమిక్కిలిగోప్యమైన; పరం-ఉత్కృష్టమైన; మే-నాయొక్క; వచః-వాక్యమును; శృణు-వినుము; త్వం-నీవు; మే-నాకు; దృఢం-నిశ్చయముగా; ఇష్టః-ప్రియుడవు; అసీతియత్ - అయితివనునదిఏదికలదో; తతః-ఆకారణమువలన; తే-నీకొరకు; హితం-హితమును; ప్రవక్ష్యామి-చెప్పెదను.

నీవు నాకు ప్రియుడవు కావున నీ క్షేమముకొఱకు మరొక రహస్యమైన మాటచెప్పెద వినుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।

మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. 65

(అదియెట్లనిన) – మన్మనాః – నా యందు మనస్సు గలవాడవును; మద్భక్తః – నాయందు భక్తిగలవాడవును; మద్యాజీ – నన్నే పూజించువాడవును; భవ – అగుము; మాం – నన్ను; నమస్కురు – నమస్కరించుము. (అట్లు చేసితివేని); మామేవ – నన్నే; ఏష్యసి – పొందగలవు; మే – నాకు; ప్రియః – ప్రియుడవు; అసి – అయితివి; తే – నీకొరకు; సత్యం – యథార్థముగా; ప్రతిజానే – ప్రతిజ్ఞ చేయుచున్నాను.

నాపై నీ మనస్సు నిలుపి భక్తి సలుపుము, నన్ను పూజించుము, నాకు నమస్కారములు చేయుము, అట్లు చేసితివేని నీవు మోక్షము పొందగలవు. నీవు నాకు ప్రియుడవు నీకు సత్యము జెప్పితినని ప్రతిజ్ఞ జేయుచున్నాను.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. 66

సర్వధర్మాన్ – సమస్త ధర్మములను; పరిత్యజ్య – విడిచి; ఏకం – ముఖ్యుడైన; మాం – నన్ను; శరణం – రక్షకునిగా; వ్రజ – పొందుము, అహం – నేను; త్వా – నిన్ను; సర్వపాపేభ్యః – సమస్త బంధములవలనను; మోక్షయిష్యామి – విడిపించగలవాడను; మా శుచః – దుఃఖపడకుము.

నీవు ఎల్లకర్మలను నాకు అర్పణముచేసి అన్యదేవతా పూజ మాని నన్నొక్కనినే శరణుపొందుము. నిన్ను ఎల్లపాపములో

నుండి విముక్తిం జేసెదను; చింత శోకింపకుము.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి. 67

తే-నీకు (జ్ఞానమార్గము తెలియుటకొఱకు), అభిహితం-చెప్పబడిన; ఇదం-ఈగీతాశాస్త్రము: అతపస్కాయ-తపస్సుచేయనివానికొఱకు; అభక్తాయ- భక్తిలేనివానికొఱకును; అశుశ్రూషవే వినని వానికొఱకును; మాం నన్ను గూర్చి; యః - ఎవ్వఁడు; అభ్యసూయతి-అసూయపడుచున్నాఁడో వానికొఱకును; కదాచన-ఎప్పుడును; న వాచ్య-ఉపదేశింపఁదగినది కాదు.

నీకు జ్ఞానముగలుగుటకై నే చెప్పిన ఈగీతాశాస్త్రమును తపస్సుచేయని వానికిని భక్తి లేనివానికిని శ్రద్ధలేనివానికిని నాయందు అసూయాపడువానికిని ఉపదేశింపఁదగినది కాదు.

య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః. 68

యః-ఎవ్వఁడు; పరమం-ఉత్కృష్టమైన; గుహ్యం - గోప్యమగు, ఇదం-ఈగీతాశాస్త్రమును: మద్భక్తేషు-నాభక్తుల విషయమై; అభిధాస్యతి-చెప్పఁగలఁడో; సః-వాఁడు, మయి-నాయందు; పరాం-ఉత్కృష్టమైన; భక్తిం-భక్తిని; కృత్వా-చేసి, మామేవ-నన్నే; ఏష్యసి-పొందఁగలఁడు.

ఎవఁడైతే పరమోత్కృష్టమై పరమరహస్యమైన ఈగీతా శాస్త్రమును నా శిష్యులకుపదేశము చేయుచున్నాఁడో వాఁడు

జ్ఞానయోగముచేత నన్ను పూజించినవారని నాఅభిప్రాయము.

శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యోనరః।
సోఽపిముక్తశ్శుభాఀల్లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణాం.

యోనరః-ఏమనుష్యుడు; శ్రద్ధావాన్-విశ్వాసముగలవాడై; అనసూయశ్చ-అసూయారహితుడై; ఇదం-ఈగ్రంథమును; శృణుయాదపి-వినునో; సోఽపి-వాడును; ముక్తః - ముక్తుడైనవాడై; శుభాన్-ప్రశస్తములైన; పుణ్యకర్మణాం-పుణ్యకర్మములుచేసినవారలయొక్క; లోకాన్- లోకములను; ప్రాప్నుయాత్-పొందును.

ఎవడైతే అసూయలేక భక్తిశ్రద్ధలతో ఈగీతాశాస్త్రమును వినుచున్నాడో ఆట్టి పురుషుడున్ను పాపములు నశింపజేసుకొనినవాడై పుణ్యకర్ములుగల పురుషులయొక్క మహత్తైనలోకమును పొందుచున్నాడు.

కచ్చిదేతచ్ఛ్రుతంపార్థ త్వయైకాగ్రేణచేతసా।
కచ్చిదజ్ఞానసంమోహః ప్రణష్టస్తేధనంజయ. 2

హే పార్థ-ఓయి అర్జున! త్వయా-నీచేత; ఏకాగ్రేణ-ఏకాగ్రమైన; చేతసా-మనస్సుచేత; ఏతత్ - ఈగీతాశాస్త్రము, శ్రుతంకచ్చిత్-వినబడెనాయేమి; హే ధనంజయ- ఓయి అర్జున! తే-నీయొక్క; అజ్ఞానసంమోహః-అజ్ఞాననిమిత్తమైన యవివేకము; ప్రణష్టఃకచ్చిత్ -పోయినాయేమి.

ఓయీధనంజయా! నాచే చెప్పబడినపరమగోప్యమగు ఈగీతాశా

స్థి)మును ఏకాగ్రచిత్తుడవై చక్కగా నీవు వింటివా? ఏమి? నీ అజ్ఞా
నజన్యమైన అవివేకము తొలగిపోయినదా? ఏమి? నాకు చెప్పుము.

అర్జున ఉవాచ.

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. 73

హే అచ్యుత-ఓ శ్రీకృష్ణస్వామీ; త్వత్ప్రసాదాత్-మీయొక్క అనుగ్రహమువలన; మోహః-అవివేకము, నష్టః-పోయెను; స్మృతిః-ఎఱుక; లబ్ధా-పొందబడెను; అహం-నేను; గతసందేహః-పోయినసందేహముగలవాడను; అస్మి-అయితిని, తవ-నీయొక్క; వచనః-వాక్యమును. కరిష్యే-చేయగలను; స్థితః-ఉన్నవాడను.

ఓయి అచ్యుతా! నీ అనుగ్రహమువలన నా అవివేకము తొలగిపోయెను. జ్ఞానము లబ్ధమాయెను. సందేహము నివర్తించె. నీ ఆజ్ఞను శిరసావహించుటకు సిద్ధముగానున్నాను.

సంజయ ఉవాచ.

ఇత్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః।
సంవాదమిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. 74

ఇతి-ఈప్రకారముగా, వాసుదేవస్య - శ్రీకృష్ణస్వామియొక్కయు, మహాత్మనః-మహానుభావుడయిన; పార్థస్యచ-అర్జునునియొక్కయు; అద్భుతం - ఆశ్చర్యకరమైన; రోమహ

హర్షణం-పులకాంకురకారకమైన; ఇమం సంవాదం-[illegible] సంవాద
మును; అహం - నేను; అశ్రౌషం-వింటిని.

ఓయి ధృతరాష్ట్ర! అద్భుతమైనట్టియు పులకాంకురములు గ
లుగ జేయునట్టియు కృష్ణార్జునుల సంవాదరూపమైన గీతా
శాస్త్రమును నేను వింటిని.

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యమహం పరమ్।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥

వ్యాసప్రసాదాత్ - వ్యాసానుగ్రహమువలన, (అనగా దివ్య
చక్షుర్లాభమువలన); యోగం - యోగమను పేరుగలిగిన; ప
రం - ఉత్కృష్టమైన; ఏతత్ - ఈ; గుహ్యం - రహస్యమును, స్వ
యం - తానే; సాక్షాత్ - ప్రత్యక్షముగా, కథయతః - చెప్పుచు
న్న; యోగేశ్వరాత్ - యోగములకు ప్రభువైన; కృష్ణాత్ -
శ్రీకృష్ణస్వామివలన; అహం - నేను, శ్రుతవాన్ - విన్నవాడనైతిని.

యోగ యోగీశ్వరుండగు శ్రీభగవంతుఁడు సాక్షాత్క
ముగా చెప్పిన పరమోత్కృష్టమైన ఈ గోప్యయోగశాస్త్రము
ను శ్రీవేదవ్యాసులనుగ్రహించుటన నేనువింటిని.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః॥

అద్భుతం - ఆశ్చర్యకర

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతిర్మమ॥

ఏచోటనైతే యోగి యోగీశ్వరుండగు శ్రీ కృష్ణస్వామియును ధనుర్ధరుడైన అర్జునుఁడును వుంటున్నారో ఆచోట సంపద జయము ఐశ్వర్యము స్థిరమైననీతి వున్నవని నామతము.

ఇతి శ్రీ మహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం
వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
మోక్షసన్న్యాస యోగో నామ
అష్టాదశోఽధ్యాయః

ఇట్లు లక్షగ్రంథమగు శ్రీ మహాభారతములో భీష్మపర్వమందు
ఉపనిషద్ రూపములును, బ్రహ్మ విద్యయును,
యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదరూపం
బైన మోక్షసన్న్యాస యోగ మనెడి
అష్టాదశోధ్యాయము ముగిసినది.

శ్రీ కృష్ణార్పణమస్తు.

ఓం తత్ సత్